# బాలుర ప్రవర్తన



కిషన్ లాల్ ఎం.ఏ; బి.ఎడ్;

ప్రకాశకులు :

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

హైదరాబాదు-500 001

# బాలుర ప్రవర్తన

(హిందీమూలం)


తెలుగు అనువాదం — కిషన్ లాల్ ఎం.ఏ; బి.ఎడ్;

హిందీ ఉపన్యాసకుడు,

శ్రీ అనంత పద్మనాభ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల

రంగారెడ్డి జిల్లా (ఆం. ప్ర.)



ప్రకాశకులు :

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

సుల్తాన్ బజార్, హైదరాబాదు-500 001

సహకారీ జనసాహిత్య ప్రకాశన్ (లిమిటెడ్)

20-3-320 హుసేనీ ఆలం రోడ్

హైదరాబాదు-500 264

ప్రథమ ముద్రణ :
2000 ప్రతులు
జూన్ 1982
వెల : రూ : 1-50

బాలుర ప్రవర్తన

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
123వ ప్రచురణ



భారత ప్రభుత్వమువారు సరసమైన వెలకు లభింప
చేసిన కాగితముపై ఈ పుస్తకము ముద్రించబడినది.

ముద్రణ :
మానసా ప్రింటింగ్ ప్రెస్సు
హిమాయత్‌నగర్
హైదరాబాదు.

# ప్రకాశకుల నివేదన

గాంధీ సాహిత్య ప్రచురణాలయం సాధారణంగా ప్రచురించే సాహిత్యమే కాకుండా బాలుర కొరకు, క్రొత్తగా అక్షరాస్యులయిన వయోజనులకు ప్రత్యేకంగా లఘు పుస్తకాలు వెలువరిస్తున్నది. వాటికి చాలావరకు ఆదరణ లభిస్తూనే ఉన్నది.

బాలుర కొరకు ప్రచురించే పుస్తక మాలలో 'బాలుర ప్రవర్తన' అనే ఈ చిరు పొత్తాన్ని అందిస్తున్నాము. దీనిని హిందీలో గోరఖ్‌పూర్‌లోని గీతా ప్రెస్సు వారు ప్రచురించారు. గీతా ప్రెస్సువారి ప్రచురణలు యావద్భారత దేశంలో ఆదరణను చూరగొన్నాయి.

ఈ హిందీ మూలాన్ని వికారాబాద్‌లోని శ్రీ అనంత పద్మనాభ ఆర్ట్స్ & సైన్సు కళాశాల హిందీ ఉపన్యాసకులు శ్రీ కిషన్‌లాల్‌గారు తెలుగులో అనువదించారు. ఈ పుస్త

కాన్ని ప్రచురించే అవకాశం కలుగచేసినందుకు జన సాహిత పరిశోళన్‌వారికి, ముఖ్యంగా స్వతంత్రానంద స్వామీజీ గారి మా కృతజ్ఞత.

ఈ పుస్తకాన్ని వయోజన విద్యాశాఖవారు, అక్షరాస్యత నంతర పాఠ్య పఠనాళికలోనూ - అల్లే చిన్నపిల్లల ఉపయు గ్రంధాలలో విద్యాశాఖ వారున్నూ చేర్చి ఈ విధమైన సాహి త్యానికి బహుళ ప్రచారం కలుగచేస్తారని ఆశిస్తున్నాము.

ఈ పుస్తకాన్ని సరిచూచిన డా॥ భీమసేన్ నిర్మల్‌గారికీ ముద్రాపకులు శ్రీ మానసా ప్రింటర్స్ వారికీ మా కృతజ్ఞతలు

ఇట్లు,

కోదాటి నారాయణరావు

కార్యదర్శి

గాంధీ సాహిత్య ప్రచురణాలయ

హైదరాబాదు

తేది. 1-6-1982

# తొలి పలుకు

గీతాప్రెస్ గోరఖ్‌పుర్ వారి ''బాలక్ కే ఆచరణ్'' అనే హిందీ మూలానికి తెలుగు అనువాదమే "బాలుర ప్రవర్తన" అనే ఈ చిరుపొత్తము. తెలుగుబాలలకిదొక చక్కని కానుక.

నేటి బాలలే రేపటి పౌరులు బాలలను సుశీలవంతులైన భావిభారత పౌరులుగా తీర్చిదిద్దటానికి ఉపయోగకరమైన సాహిత్యం ఎంతో అవసరం. ''జనసాహిత్య ప్రకాశన్'' హైదరాబాదువారు ఇట్టి ఆవశ్యకతను గుర్తించి ఈ పుస్తకమును తెలుగులో ప్రచురించటం హర్షించదగిన విషయం.

పై సంస్థకు సంబంధించిన ప్రముఖులలో ఒకరైన పూజ్య శ్రీస్వతంత్రానందస్వామీజీ (పూర్వాశ్రమనామం శ్రీమగన్ చంద్రదవేదీజీ) మహారాజ్‌గారు ఈ అనువాదానికి అమిత వాత్స ల్యంతో నన్ను ప్రోత్సహించి, ఆశీర్వదించిన మహానుభావులు. ఈ కార్యానికి వారే మూలకారకులు. నేను నిమిత్తమాత్రుడను.

ఆంధ్రానువాదములో ఆరితేరిన గురువరేణ్యులు డా॥ భీమసేన్ 'నిర్మల్'జీ, హిందిరీడర్ (ఉస్మానియా విశ్వ విద్యాలయము)గారు ఎంతో ఓపికతో దీనికి మెరుగులు దిద్దినారు.

గాంధీ సాహిత్య ప్రచురణాలయం హైదరాబాదు వారు తమ సంపూర్ణ సహాయ సహకారముల నందజేసినారు. ఇంకను ఎందరో సహృదయులైన మిత్రులు ఇందులకు శాయశక్తులా సహకరించినారు.

అందరికీ నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఇది నా తొలి ప్రయత్నం. కావున విజ్ఞులు సహృదయతతో ఆదరించి మునుముందు ఈ రంగంలో ఇతోధిక సేవచేయటానికి నన్ను ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను.

—అనువాదకుడు

కిషన్‌లాల్ ఎం.ఏ; బి.ఇడి.
హిందీ లెక్చరర్
శ్రీ అనంతపద్మనాభకళాశాల
వికారాబాదు, రంగారెడ్డి జిల్లా (ఆం.ప్ర.)

తేది 1-5-1982

# విన్నపం

బాలుర ప్రవర్తన ఎలా ఉండాలి- అనేదే ఈ చిన్న పుస్తకంలో తెలుపబడ్డది. శీల సంపాదన విద్యకు ప్రాణము, ముఖ్యమైన అంగము కూడా. ఈ పుస్తకం ద్వారా పిల్లలకు శీల సంపాదనలో తగినంత ప్రేరణ లభిస్తుంది. ఆదర్శమైన జీవితాన్ని అలవరచుకోవడంలో వారికి ఇది ఏ కొద్దిగా సహాయ పడినా మాకెంతో సంతోషం కలుగుతుంది.

విధేయుడు
హనుమాన్‌ప్రసాద్ పోద్దార్

# విషయ సూచిక


| విషయం | | పుటసంఖ్య |
|---|---|---|
| 1 | దేశగౌరవం | 1 |
| 2 | ధర్మాచరణ | 3 |
| 3 | జాతిమర్యాద | 5 |
| 4 | విడువ వలసినవి | 7 |
| 5 | అడగనిదే చేయకండి | 9 |
| 6 | క్షమాపణ కోరుకోండి | 10 |
| 7 | త్యాగం | 11 |
| 8 | గొప్పవాళ్లు కాదలచుకున్నారా ? | 13 |
| 9 | గుర్తు ఉంచుకోండి | 15 |
| 10 | ధనంయొక్క ఉపయోగం | 17 |
| 11 | బలం యొక్క ఉపయోగం | 20 |
| 12 | బుద్ధియొక్క ఉపయోగం | 22 |
| 13 | సజ్జనులూ – దుర్జనులూ | 24 |
| 14 | కలసి మెలసి మెలగండి | 25 |
| 15 | ఎన్నటికీ చేయవద్దు | 27 |
| 16 | మానవుడు | 29 |

శ్రీహరిః

# బాలుర ప్రవర్తన

## దేశగౌరవం

మనం జన్మించిన దేశం
మర్యాదా పురుషోత్తముడూ, భగవంతుడూ అయిన శ్రీరామ
చంద్రుడు అవతరించిన దేశం
లీలా మానుష విగ్రహుడూ, భగవంతుడూ అయిన శ్రీకృష్ణుడు
అవతరించిన దేశం.
వాల్మీకిమహర్షిరామాయణం గానంచేసిన దేశం
వేదవ్యాస మహర్షి మహాభారతం రచించిన దేశం
మనం జన్మించిన దేశంలో—
యుధిష్ఠిరుని (ధర్మరాజు) వంటి ధర్మాత్ములు జన్మించినారు.
దధీచి వంటి దాతలు జన్మించినారు.
హరిశ్చంద్రుని వంటి సత్యసంధులు జన్మించారు.
మనం జన్మించిన దేశంలో....
రాణాప్రతాపసింహుని వంటి ప్రతిజ్ఞాశూరులు జన్మించారు
ఛత్రపతి శివాజీవంటి ధీరవీరులు జన్మించారు

గురుగోవిందుని వంటి కర్మవీరులు జన్మించారు
మనం పుట్టిన దేశంలోనే....
లోకమాన్యతిలక్ వంటి కర్మయోగులు పుట్టారు
మహామాన్యుడు మాళవ్యావంటి నిష్ఠావంతులు పుట్టారు.
సత్యఅహింసలను ఆరాధించిన గాంధీవంటిమహాత్ములు పుట్టారు
మన దేశం....
భీమార్జునుల వంటి వీరులు పుట్టిన దేశం
సావిత్రీ అనసూయల వంటి పతివ్రతలు పుట్టిన దేశం
గోస్వామి తులసీదాసూ, సూరదాసులవంటిభక్తులు పుట్టినదేశం
మన దేశం....
గౌరవనీయమయినది
వైభవోపేతమయినది
మహోన్నతమయినది
మనదేశ మర్యాదకు విరుద్ధమైన పనులూ, మనదేశ గౌరవాన్ని
కించపరచే పనులు మనం ఎన్నటికీ చెయ్యబోము
మనం దేశగౌరవాన్ని కాపాడుకుందాం
మనం దేశపు పరువు-మర్యాదలను కాపాడుకుందాం



# ధర్మాచరణ

భగవంతుడు ధర్మరక్షణ కోసం అవతరిస్తాడు

సత్పురుషులు ధర్మాన్ని రక్షిస్తారు

సజ్జనులు ధర్మాన్ని ఆచరిస్తారు

ధర్మాన్ని రక్షించేవాణ్ణి ధర్మం రక్షిస్తుంది

ధర్మమర్యాదను కాపాడేవాడి మర్యాదస్థిరంగా నిలుస్తుంది

శిబి చక్రవర్తి ధర్మాత్ముడు

రంతిదేవుడు ధర్మాత్ముడు

యుధిష్ఠిరుడు ధర్మాత్ముడు

ధర్మాత్ములపేరు శాశ్వతంగా నిలిచిపోయింది

ధర్మాత్ములకు దైవసాన్నిధ్యం లభించింది.

ధర్మాత్ములను లోకం గౌరవిస్తుంది

ధర్మాచరణవల్ల సుఖంలభిస్తుంది

ధర్మాచరణవల్ల శాంతి లభిస్తుంది

ధర్మాచరణవల్ల కీర్తి పెరుగుతుంది

ధర్మాచరణవల్ల శుభం కలుగుతుంది

ధర్మం ఉన్నచోట దుఃఖం ఉండదు

ధర్మం ఉన్నచోట అశాంతి ఉండదు

ధర్మం ఉన్నచోట జగడాలు, తంటాలు ఉండవు

ధర్మం ఉన్నచోట దయ ఉంటుంది

ధర్మం ఉన్నచోట సత్యం ఉంటుంది

ధర్మం ఉన్నచోట ఓర్పు ఉంటుంది

ధర్మం ఉన్నచోట ఔదార్యం ఉంటుంది

ధర్మం ఉన్నచోట త్యాగం ఉంటుంది

ధర్మం ఉన్నచోట ఆనందం ఉంటుంది

మనం ధర్మాన్ని ఆచరిద్దాం

మనం ధర్మానికి కట్టుబడి ఉందాం

మనం ధర్మానికి అనుకూలంగా నడచుకుందాం.



# జాతిమర్యాద

ఆంగ్లేయుల్లో జాతిగౌరవం ఉన్నది.
జర్మనులలో జాతిగౌరవం ఉన్నది.
జపాను వారిలో జాతిగౌరవం ఉన్నది.

జాతిగౌరవం సన్మానించ తగింది.
జాతిమర్యాద సన్మానించ తగింది.
జాతిమర్యాద పాటించ తగింది.

జాతిమర్యాదను కించ పరచటం తగదు.
జాతిమర్యాదను ఉల్లంఘించటం తగదు.
జాతిమర్యాదను హేళన చేయటం తగదు.

ఇతరులను కించపరచటంలో జాతిమర్యాదలేదు.
ఇతరులను ఏవగించుకోవటంలో జాతిమర్యాదలేదు.
ఇతరులను తిరస్కరించటంలో జాతిమర్యాదలేదు.

జాతిమర్యాద శీల రక్షణలో ఉన్నది.
జాతిమర్యాద నిగ్రహంలో ఉన్నది.
జాతిమర్యాద నియమపాలనలో ఉన్నది.

స్వజాతి గౌరవాన్ని కాపాడుకోండి
ఇతర జాతులను గౌరవించండి.
స్వజాతి మర్యాదను పాటించండి.
అన్య జాతిమర్యాదను గౌరవించండి.
స్వజాతి నియమాలను పాటించండి.
అన్యజాతి నియమాలను గౌరవించండి.



# విడువ వలసినవి

అసత్యమాడేవాడు అసత్యవాది
దొంగతనం చేసేవాడు దొంగ
నిందించేవాడు నిందకుడు
చాడీలు చెప్పేవాడు కొండెగాడు.

ఓర్వలేనివాడు ఈర్ష్యాళువు
గర్వపడేవాడు గర్విష్ఠి
తిట్టేవాడు అనాగరికుడు
ఎత్తి పొడుపుమాటలు పలికేవాడు క్రూరుడు.

మీరు అసత్యవాదులు కారు
మీరు దొంగలు కారు
మీరు నిందకులు కారు
మీరు కొండెగాళ్ళు కారు.

మీరు ఈర్ష్యాళువులు కారు.
మీరు గర్విష్ఠులు కారు.
మీరు అనాగరికులు కారు.
మీరు క్రూరులు కారు.

అసత్యమాడకండి-అసత్యవాదులనిపించుకోకూడదు
దొంగతనం చేయకండి-దొంగలనిపించుకోకూడదు
ఎవరినీ నిందించకండి-నిందకులనిపించుకోకూడదు
చాడీలు చెప్పకండి-కొండెగాళ్ళనిపించుకోకూడదు

ఒకరిని చూచి అసూయపడకండి- ఈర్ష్యాళువులనిపించు
కోకండి

గర్వపడకండి-గర్విష్ఠులనిపించుకోకండి.

ఎవరినీ తిట్టకండి
ఎవరుకూడ మిమ్మల్ని అనాగరికులనుకోకూడదు
ఎవరినీ ఎత్తిపొడవకండి
ఎవరుకూడ మిమ్మల్ని క్రూరులనుకోకూడదు.



# అడగనిదే చేయకండి

అడగనిదే ఎవరి వస్తువూ తీసికోవద్దు
అడగనిదే ఏ కార్యాలయంలోకి పోవద్దు
అడగనిదే ఎవరి ఇంటిలోనూ దూరవద్దు
అడగనిదే ఎవరి వస్తూవూ ముట్టుకోవద్దు

మిమ్మల్ని అడగకుండా ఎవరైనా మీ వస్తువు తీసికొంటే మీకు
చెడ్డగా తోస్తుందా? లేదా?
మిమ్మల్ని అడగకుండా ఎవరైనా మీ వస్తువు తాకితే మీకు
చెడ్డగా తోస్తుందా? లేదా?
మిమ్మల్ని అడగకుండా ఎవరైనా మీ వద్దకు వస్తే మీ పనికి
ఆటంకం కలుగుతుందా? లేదా?
మిమ్మల్ని అడగకుండా ఎవరైనా మీయింట్లో దూరితే మీకు
చెడ్డగా అనిపిస్తుందా? లేదా?

ఒకరికి చెడ్డగా తోచేపని చేయకండి
ఒకరికి బాధకలిగేపని చేయకండి
ఒకరికి అసౌకర్యం కలిగించే పని చేయకండి.

# క్షమాపణ కోరుకోండి

పొరపాటున ఒకరితో కఠినంగా పలికితే
వెంటనే క్షమాపణ కోరుకోండి
పొరపాటున ఒకరిని నొప్పించే పనిచేస్తే
వెంటనే క్షమాపణ కోరుకోండి
పొరపాటున త్రోవలో ఒకరిని ఢీకొంటే
వెంటనే క్షమాపణ కోరుకోండి
పొరపాటున ఒకరి వస్తువు తీసికొంటే
వెంటనే క్షమాపణ కోరుకోండి

తన తప్పును ఒప్పుకోవటం సత్పురుషుని లక్షణం
తన తప్పుకు క్షమాపణ వేడుకోవటం సత్పురుషుని లక్షణం
తన తప్పును దిద్దుకోవటం సత్పురుషుని లక్షణం

మీ తప్పును ఒప్పని చెప్పుకోవద్దు
మీ తప్పును సమర్థించుకోవద్దు
మీ తప్పుకు కారణాలు లెక్కపెట్టవద్దు
మీ తప్పును వెంటనే ఒప్పుకోండి
మీ తప్పును వెంటనే సరిదిద్దుకోండి
మీ తప్పుకు క్షమాపణ వేడుకోండి

# త్యాగం

కోతిని పట్టుకొనేవాళ్ళు చిన్నమూతివుండే పాత్రను పాతిపెడతారు ఆ పాత్రలో శనగలు నింపుతారు; కోతి వస్తుంది పాత్రలో చేయి పెడుతుంది. పిడికిట్లో శనగలు నింపుకుంటుంది పిడికిలి పాత్రలోనుండి వెలుపలికిరాదు. కోతి శనగలనువదలదు

కోతి పట్టుపడుతుంది
లోభమువల్ల కోతి పట్టుబడిపోతుంది
కోతివలె మీరు లోభపడకండి.

త్యాగంలో వివేకం ఉన్నది
త్యాగంలో ఔదార్యం ఉన్నది
త్యాగంలో మానవత్వం ఉన్నది
త్యాగంలో ధర్మం ఉన్నది
త్యాగంలో దయ ఉన్నది
త్యాగంలో కీర్తి ఉన్నది
త్యాగం వల్ల భగవంతుడు సంతోషిస్తాడు

ఇతరుల మేలుకోసం మీ స్వార్థం వదలండి
ఇంటి మేలుకోసం స్వార్థం వదలండి

ఊరి మేలుకోసం ఇంటి స్వార్థం వదలండి
జాతి మేలుకోసం ఊరి స్వార్థం వదలండి
దేశ క్షేమంకోసం ఊరి స్వార్థం వదలండి
విశ్వ శ్రేయస్సుకోసం దేశ స్వార్థం వదలండి.

త్యాగం లేనిదే పరోపకారం లేదు
త్యాగం లేనిదే శాంతి లేదు
త్యాగం లేనిదే ధర్మం లేదు
త్యాగం చేయటం నేర్చుకోండి.

# గొప్పవాళ్లు కాదలచు కున్నారా?

మీరు గొప్పవాళ్లు కాదలచుకున్నారా?
మీ మనస్సులో గొప్పవాళ్లం కావాలని ఉన్నదా?
మీరుకూడా మహాపురుషులు కాదలచుకున్నారా?

గొప్పవాళ్లు కాదలచుకుంటే—
తళుకు బెళుకులు వదలివేయండి
ఆడంబరాల మోహం వదలి వేయండి
మేడ మిద్దెల మీద మోజు వదలివేయండి
మోటార్లపైన మమత వదలి వేయండి.

మీరు గొప్పవాళ్లు కాదలచుకుంటే—
ధనధాన్యాల మోహం వదలివేయండి
విందుభోజనాల మీద ఆసక్తి తీసివేయండి
భోగవిలాసాలమీద ఆశ వదలివేయండి
వినోద విహారాలమీద కోరిక వదలివేయండి.

మీరు గొప్పవాళ్లు కాదలచుకుంటే—
సాదా దుస్తులు ధరించండి
మామూలు భోజనం చేయండి

గుడిసెలో ఉండడానికి కూడ సిద్ధపడండి
కాలినడకన వెళ్లటానికి వెనుకాడకండి
కష్టపడటానికి ఇష్టపడండి.

మీరు గొప్పవాళ్లు కాదలచుకుంటే—
సత్యాన్ని విడవకండి
త్యాగం అలవరచుకోండి
దుఃఖితులకు సేవ చేయండి
అపరాధాలను క్షమించడం నేర్చుకోండి

మీరు గొప్పవాళ్ళు కాదలచుకుంటే—
అమాయకులూ, సద్వర్తనులూ కండి
మంచి నడవడీ, నిగ్రహం నేర్చుకోండి
నియమవర్తన అభ్యసించండి
సోమరితనాన్ని తొందరపాటును తొలగించుకోండి
సమయాన్నిగూర్చి శ్రద్ధ వహించండి

,మీరు గొప్పవాళ్ళు కాదలచుకుంటే ....
భగవంతుని మీద భారం వెయ్యండి
భగవంతుడే అన్నిటికన్న మిన్న
భగవంతునికే ధర్మమే ప్రియం
ధర్మాన్ని పాటించండి
భగవంతుడు దీనబాంధవుడు
దీనులకు దుఃఖితులకూ, సేవచేయండి

# గుర్తు ఉంచుకోండి

గుర్తు ఉంచుకోండి

పరిశుభ్రంగా ఉండనివాడు జబ్బుపడతాడు
పరిశుభ్రంగా ఉండనివాడికి శాంతి ఉండదు.
పరిశుభ్రంగా ఉండనివాణ్ణి అందరూ ఏవగించుకుంటారు

గుర్తు ఉంచుకోండి....

సత్ప్రవర్తన లేనివాడు జబ్బుపడతాడు
సత్ప్రవర్తన లేనివాడు అశాంతి పొందుతాడు
సత్ప్రవర్తన లేనివాణ్ణి అందరు ఏవగించుకుంటారు

గుర్తు ఉంచుకోండి....

కష్టపడి పనిచేయనివాడు జబ్బు పడతాడు
కష్టపడి పనిచేయనివాడు ఎక్కడనూ సాఫల్యం పొందడు

గుర్తు ఉంచుకోండి....

సత్యవాదిని లోకులు గౌరవిస్తారు
సద్వర్తన గలవాణ్ణి ఆదరిస్తారు
శుభ్రంగాను పవిత్రంగాను ఉండేవాణ్ణి గౌరవిస్తారు

గుర్తు ఉంచుకోండి....

నియమంగా నడచుకునేవాడు సఫలుడౌతాడు
మెలకువతో మెలగేవాడు సఫలుడౌతాడు
సోమరితనం లేనివాడు సఫలుడౌతాడు

గుర్తు ఉంచుకోండి

గర్వపడనివాడు సఫలుడౌతాడు
మొండితనం లేనివాడు సఫలుడౌతాడు
క్రోధం లేనివాడు సఫలుడౌతాడు.



# ధనం యొుక్క ఉపయోగం

భగవంతుడు మిమ్మల్ని ధనవంతులుగా చేశాడు.
మీరు పూర్వజన్మలో పుణ్యం చేసుకున్నారు.
ఆ పుణ్యానికి ఫలం – ధనమూ, సౌఖ్యమూ
మీ పుణ్యమే మీకు ధనం ప్రసాదించింది.

లభించిన ధనంతో మీరు ఏంచేస్తారు ?

పెద్దపెద్ద సౌధాలు నిర్మిస్తారా ?
మేలురకం మోటార్లు కొంటారా ?
వైభవాలతో జీవితం గడుపుతారా ?
ఇలాచేయటం ధనాన్ని సద్వినియోగపరచటం కానేరదు.

ధనం కలిగిఉండి దానితో మీరేమి చేస్తారు ?

ఇంటినిండా నౌకర్లనూ చాకర్లనూ పెట్టుకుంటారా ?
అందరిపైనా అధికారం చలాయిస్తారా ?
అందరినీ లొంగదీసికొంటారా ?
ఇలాచేయటం ధనంయొక్క సదుపయోగం కానేరదు.

ధనం ఉన్నదని గర్వపడకండి
మీ ధనంతో ఎవరినీ అవమానపరచకండి
ధనం కలిగి ఎవరినీ చిన్నచూపు చూడవద్దు

ధనం ఉన్నందుకు పేదలకు సేవ చేయండి.
ధనం ఉన్నందుకు నిర్ధనులకు సాయపడండి.
మీ ధనంతో ఇతరులకు మేలు చేయండి
ఇదే ధనంయొక్క సద్వినియోగం.

ధనం ఉన్నదని మనోనిగ్రహం వీడకండి.
ధనం ఉన్నదని సద్వర్తన మానకండి.
ధనం ఉన్నది గదా అని నిరాడంబర జీవనం వదలకండి

ధనంపొంది సోమరిపోతులు కావద్దు.
ధనంకలిగి దురభిమానులు కావద్దు.
ధనం ఉంచుకొని పిసినారులు కావద్దు.

సోమరివాని ధనం నాశం అవుతుంది.
దురభిమాని ధనం తప్పక నశిస్తుంది.
ఇతరులను తిరస్కరించేవాని ధనం హరించిపోతుంది.

మంచినడతలేని వానిధనం క్షీణించిపోతుంది.

ఆడంబరం వదలని వానిధనం నష్టమైపోతుంది.

పరోపకారం చేయనివాని ధనం మాయమైపోతుంది.

ధనానికి శోభతెచ్చేది సద్వర్తన.

ధనానికి అందం తెచ్చేది నిరాడంబరత్వం

ధనానికి గౌరవం కల్పించేది ఔదార్యం.

ధనానికి ప్రతిష్ఠ తెచ్చేది నిగ్రహం.

ధనానికి శోభ పరిశ్రమ.

దానంచేయటమే ధనానికి సద్వినియోగం.

దీనులకు సహాయపడటమే ధనంయొక్క సదుపయోగం.

లోక కళ్యాణంకోసం వెచ్చించటమే ధనాన్ని

సద్వినియోగపరచటం



# బలం యొక్క ఉపయోగం

భగవంతుడు మిమ్మల్ని బలశాలురుగా చేశాడు.
మీ శరీరంలో బలం ఉన్నది.
మీకు సహచరుల బలంకూడ ఉన్నది.
ఈ బలంతో మీరేమి చేస్తారు ?

బలంతో మీరు ఇతరులపై అధికారం సాధిస్తారా ?
బలంతో మీరు ఇతరులను బెదరకొడతారా ?
బలంతో మీరు ఇతరులను లొంగదీసుకుంటారా ?

ఇది బలంయొక్క సద్వినియోగంకాదు.
మరవకండి, రోగంతో మీ బలం క్షీణిస్తుంది.
మరవకండి, ముసలితనంతో బలం క్షీణిస్తుంది.
మరవకండి, మీ బలం ఎల్లకాలం ఇలాగే ఉండదు.

ఇతరులను గద్దించటం బలాన్ని దుర్వినియోగం చేయటమే
ఇతరులను భయపెట్టడం బలాన్ని దుర్వినియోగం చేయటమే
ఇతరులను వేధించటం బలాన్ని దుర్వినియోగం చేయటమే

భగవంతుడు మీకు బలం ఇచ్చాడు.
భగవంతుడు మిమ్మల్ని బలశాలురుగా చేశాడు.
బలాన్ని దుర్వినియోగపరిస్తే అది క్షీణిస్తుంది.

బలానికి శోభతెచ్చేది నమ్రత.
బలానికి శోభకూర్చేది క్షమాగుణం.
బలానికి శోభ కలిగించేది నిగ్రహం.

బలహీనుల్ని రక్షించటం సద్వినియోగం చేయటం.
భయగ్రస్తుల భయం నివారించటం బలాన్ని సద్వినియోగం చేయటం
దుఃఖపీడితులకు సహాయపడటం బలాన్ని సద్వినియోగం చేయటం

మీ బలంతో మీరు ఏంచేస్తారు ?

బలహీనులకూ, దుఃఖార్తులకూ సహాయం చేస్తారు
భయగ్రస్తులకు రక్షణ కల్పిస్తారు.
కష్టాలు పడేవారికి తోడ్పడతారు.

# బుద్ధి యొక్క ఉపయోగం

భగవంతుడు మిమ్మల్ని బుద్ధిమంతులుగా చేశాడు

భగవంతుడు మీకు ప్రతిభ ఇచ్చాడు

భగవంతుడు మీకు బుద్ధినిచ్చాడు

భగవంతుడు మీకు విద్యనిచ్చాడు.

బుద్ధిగలవారై మీరేం చేస్తారు ?

ఇతరులమీద పెత్తనం సాగిస్తారా ?

ఇతరులను తర్కంతో ఓడిస్తారా ?

ఇతరులచే మీమాటను ఒప్పించుకుంటారా ?

ఇలాచేయటం బుద్ధిని సద్వినియోగపరచటంకాదు.

విద్వాంసుడు గర్విష్ఠిఅయితే వాడు మూర్ఖుడే.

విద్వాంసుడూ, బుద్ధిమంతుడూ అయి సద్వర్తన లేకుంటే

వాడుమూర్ఖుడే.

విద్వాంసుడూ, బుద్ధిమంతుడూ అయి నిగ్రహంలేకపోతే

వాడు మూర్ఖుడే.

విద్వాంసుడూ, బుద్ధిమంతుడూ అయి వినయంలేకపోతే

వాడు మూర్ఖుడే.

బుద్ధిమంతుడై మర్యాదపాటించనపైతే వానిబుద్ధి వ్యర్థం.
బుద్ధిమంతుడై ధర్మాన్ని అనుసరించకపోతే వానిబుద్ధి వ్యర్థం
బుద్ధిమంతుడై సద్వర్తన లేకపోతే వాని బుద్ధి వ్యర్థం.

విద్యా బుద్ధులకు శోభకలిగించేది నమ్రత.
విద్యాబుద్ధులకు శోభనిచ్చేది సద్వర్తన.
విద్యాబుద్ధులకు శోభతెచ్చేది ధర్మాచరణ.

బుద్ధిమంతులై సద్వర్తన పాటించండి.
బుద్ధిమంతులై ధర్మాన్ని ఆచరించండి.
బుద్ధిమంతులై మర్యాదను కాపాడుకోండి.

మీరు బుద్ధిమంతులైతే ఇతరులకు సద్వర్తన నేర్పండి.
మీరు బుద్ధిమంతులైతే ఇతరులకు ధర్మం నేర్పండి.
మీరు బుద్ధిమంతులైతే ఇతరులకు మర్యాద నేర్పండి

ఇతరులకు జ్ఞానమిచ్చేవాడు బుద్ధిమంతుడు
ఇతరుల తప్పులు సరిదిద్దేవాడు బుద్ధిమంతుడు
ఇతరులపై కోపగించనివాడు బుద్ధిమంతుడు
ఇతరుల అపరాధం క్షమించేవాడు బుద్ధిమంతుడు

# సజ్జనులూ – దుర్జనులూ

సజ్జనుని వద్ద ధనముంటే వాడు దానం చేస్తాడు.

సజ్జనుని వద్ద బలముంటే దుఃఖార్తులకు సహాయం చేస్తాడు

సజ్జనుని వద్ద విద్యాబుద్ధులుంటే ఇతరులను గౌరవిస్తాడు

దుర్జనుని వద్ద ధనముంటే వాడు గర్వపడతాడు

దుర్జనుని వద్ద బలముంటే ఇతరులను వేధిస్తాడు

దుర్జనుని వద్ద విద్యాబుద్ధులుంటే ఇతరులతో వాగ్వాదం పెట్టుకుంటాడు

మీరు దుర్జనులు కావద్దు

మీరు మీ ధనానికి గర్వపడకండి

మీరు ఎవరినీ వేధించవద్దు

మీరు ఎవరితోనూ వాగ్వాదం చేయవద్దు

మీరు సజ్జనులు అవండి

మీరు మీ ధనంతో పరోపకారం చేయండి

మీరు మీ బలంతో ఇతరులను రక్షించండి

మీరు విద్యనార్జించి ఇతరులను గౌరవించండి.

# కలసిమెలసి మెలగండి

మిత్రులందరు కలసి మెలసి ఉండండి
మిత్రులందరు కలసి మెలసి ఆడుకోండి
మిత్రులందరు కలసి మెలసి చదువుకోండి

కలసి మెలసి కష్టపడండి
కలసి మెలసి విశ్రాంతి తీసుకోండి
కలసి మెలసి పనిచేయండి

సుఖంలో కలసి మెలసి ఉండండి
దుఃఖంలో కలసి మెలసి ఉండండి
ఆనందంలో కలసి మెలసి ఉండండి
శోకంలో కలసి మెలసి ఉండండి

ఐశ్వర్యంలో కలసి మెలసి ఉండండి
దారిద్ర్యంలో తోడుగా ఉండండి
సంపదలో తోడుగా ఉండండి
విపత్తులో తోడుగా ఉండండి

సుఖంలో మిత్రులతో సుఖం అనుభవించకపోతే నష్టంలేదు

ఆనందంలో మిత్రులతో ఆనందం అనుభవించకపోతే నష్టంలేద

ఐశ్వర్యంలో మిత్రులతో భోగం అనుభవించకపోతే నష్టంలేద

కాని దుఃఖంలో మిత్రునికి తోడుగా ఉండండి

శోకంలో మిత్రునికి తోడుగా ఉండండి

ఆపదలో మిత్రునికి తోడుగా ఉండండి

దుఃఖంలో తోడ్పడేవాడు నిజమైన మిత్రుడు

శోకంలో తోడ్పడేవాడు నిజమైన మిత్రుడు

ఆపదలో తోడ్పడేవాడు నిజమైన మిత్రుడు



# ఎన్నటికీ చేయవద్దు

ఎవరినీ కొట్టవద్దు
ఎవరినీ తిట్టవద్దు
ఎవరితోనూ పోట్లాడకండి
ఎవరినీ వెక్కిరించకండి

ఎవరినీ ఎన్నడూ వంచించవద్దు
ఎవరినీ ఎన్నడూ మోసగించవద్దు
ఎవరిపట్లా నిర్దయత కూడదు
అబద్ధాలు చెప్పకూడదు

దొంగతనం చేయవద్దు
జగడాలు ఆడవద్దు
ఈర్ష్యపడవద్దు
కట్టుబాటు తప్పవద్దు

తొందరపాటు చూపవద్దు
వినయం విడువవద్దు

వివేకం పోగొట్టుకోవద్దు

సాహసం విడువవద్దు

ఆలోచన పోగొట్టుకోకండి

ధైర్యం పోగొట్టుకోకండి

సోమరిపోతులు కావద్దు

గర్విష్ఠులు కావద్దు

పిరికివాళ్ళు కావద్దు

బద్ధకస్తులు కావద్దు

చెడుపనులు చేయకండి

చెడ్డఆటలు ఆడకండి

చెడ్డఅలవాట్లు అలవరచుకోకండి

పనిలో బద్ధకం చూపకండి

పరిశ్రమలో అలసట చెందకండి

దుఃఖాలకు భయపడకండి

ఎన్నడూ నిరాశ చెందవద్దు

ఎన్నడూ ఎవరినీ తిరస్కరించవద్దు

ఎన్నడూ ఎవరినీ అవమానించవద్దు

ఎన్నడూ ఎవరినీ నీచంగా చూడవద్దు

ఎన్నడూ ఎవరినీ బాధించవద్దు 

# మానవుడు

మానవుడెవడు ?

వైభవంగా ఉండేవాడా ?
సుఖసంతోషాలతో ఉండేవాడా ?
మేడల్లో మిద్దెల్లో ఉండేవాడా ?
మోటర్లలోనూ, విమానాలలోనూ, ప్రయాణం చేసేవాడా ?

ఎన్నో పశువులు కూడా వైభవంగా ఉంటాయి
ఎన్నో పశువులు కూడా సుఖంగానూ, సంతోషంగానూ ఉంటాయి
ఎన్నో పిల్లులు-కుక్కలు కూడా మిద్దెల్లో మేడల్లో ఉంటాయి
ఎన్నో పిల్లులు-కుక్కలు కూడా మోటార్లలోను, విమానాలలోను ప్రయాణం చేస్తాయి

కాని అవిమానవులు కావుగదా ?
పశువులూ పక్షులూ కూడా ఆహారానికి ఆరాటపడుతుంటాయి
పశువులూ పక్షులూ కూడా సుఖాన్ని కోరుతుంటాయి

కోపం వచ్చినప్పుడు పశువులూ పక్షులూ కూడా కొట్లాడుతాయి
మీలోనూ ఈ చేష్టలే ఉంటే మీరు మానవులెట్లౌతారు ?

మనస్సును కట్టివేసికోగలిగినవాడే మానవుడు
ఆలోచించి పనిచేసేవాడే మానవుడు
నిగ్రహ నియమాలను పాటించేవాడే మానవుడు
తన కోపాన్ని అణచుకోగలవాడే మానవుడు

ఇతరులసేవ చేసేవాడే మానవుడు
ఇతరులకు సహాయం చేసేవాడే మానవుడు
ఇతరుల కోసం తన సుఖాన్ని త్యాగం చేసేవాడే మానవుడు
ఇతరుల మేలుకోసం కష్టాలు సహించేవాడే మానవుడు

మీరు నిజమైన మానవులు కండి
మీరు మానవోచితమైన పనులు చేయండి
మీరు మానవునికి తగినట్లుగా ఆలోచించండి

